# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు 15 జూన్ | సంచిక 3 |
|---|---|---|




## నిత్యసంకీర్తనము

**వివరణము :**

సేవ, పవిత్రత, నమ్రత,—ఇది మన స్వభావమును నిర్ణయించును. ఈ మూడును లేనినాడు ఆధ్యాత్మికాభివృద్ధి కలుగనేరదు. వీని నెల్లవారును అతిశ్రద్ధతో అభ్యసింపవలెను. అపుడు గాని దైవసందర్శనము లభింపదు. ఆదైవము మనవాడే యని యెఱింగినపుడు మనగర్వము, భయము, ఆందోళన మొదలగునవన్నియు నదృశ్యమగును. శాంతిచేకూరును. మన హృదయము నిర్మలముగ నున్నప్పుడు భగవంతుడు దానిలో ప్రతిబింబించుచుండును. అట్టి అనుభవమును స్వార్థమును వీడి మన ప్రతిపని యందును, ప్రతివాక్యమునందును, ప్రతిభావమునందును ప్రకాశింపజేయుదుము.

**సంకీర్తనము:**

1. ఆసర్వదయామూర్తి నా చిత్తమును, హృదయమును, పవిత్రమొనర్చుగాక!
2. నా శరీరమంతయు ఆయన కరుణారసముచే పునీతమగు గాక !

—స్వామి రామతీర్థ

# వేడికోలు

ఉభయభాషాప్రవీణ పండిత గుఱ్ఱప్పడియ ఆంజనేయులు.

సీ. తలఁపుమల్లికలు వెన్నెల గుడారములెత్తి । నతివేల సామరస్యము ఘటించి ·
చెఱలాడు మబ్బు దొంతఱలు రూపఱిపోవ । సుకుమార పవనడోలికలఁగదిపి
దిక్కరి యెదురైన చుక్కలన్నాలికేగ । కాలచక్రమున వక్రముగఁ ద్రిప్పి
చివికి జీర్ణించిచేసిన తపస్సు ఫలింప । సంపూర్ణఫలము హస్తమున కొనఁగి
గీ. అటునిటు దయారసప్రవాహములఁ బఱపి? పరమపరమేశ్వరుఁడు దీనబాంధవుండు
అస్మదీయుల నాంధ్రసేవాభిరతుల । ఉభయబాధాప్రవీణుల నోముఁగాత !

[వివ: ఉభయబాధాప్రవీణులు-టీచరు-మేనేజరులు]

---

# పాడరా! బాలుఁడా!

యస్. సత్యనారాయణ

1. నన్నయార్యుని నాణ్యపుమాటల
తిక్కనార్యుని దివ్యపు పల్కుల
ఎఱ్ఱనార్యుని యింపుమాటలను
పోతనార్యుని పూతవాక్కులను
పాడరా ! బాలుఁడా !

2. శ్రీనాథకవి సింగారంబుల
పెద్దనార్యుని ముద్దుపల్కులను
సూరనార్యుని సొంపురచనలను
కృష్ణరాయల కీర్తిగీతముల
పాడరా ! బాలుఁడా !

3. బాలచంద్రుని బాహుబలంబును
ఖడ్గతిక్కన ఖ్యాతినీతులను
తుళువవీరుల దోర్బలశక్తిని
తెలుఁగు తల్లుల ధీరగుణమును
పాడరా ! బాలుఁడా !

4. ఆంధ్రవీరుల యౌన్నత్యంబును
ఆంధ్రపురుషుల యౌదార్యంబును
ఆంధ్రరాజుల కవితాప్రేమను
ఆంధ్రపుత్రుల కళాపిపాసను
పాడరా ! బాలుఁడా !

---

# గురుసంప్రదాయము

[అప్పుడు - ఇప్పుడు]

ఈ మహావిశ్వరంగమున నేడు చెలరేగిన ఘోరసంగ్రామ సంక్షోభము వలనఁ బ్రతిదేశము యొక్క ఆర్థికసుస్థితి మారిపోయినది. మారిపోవుటయేకాదు - సుస్థితిశబ్దమే శూన్యమైపోయినది. భాగ్యవంతములైన పాశ్చాత్యదేశము లన్నియు నేటి ప్రచండయుద్ధ సంక్షోభమునకు గురియై అన్నమో రామచంద్రాయని అలమటించుచుండ సహజముగా నిందు పేదతనమున దొప్పదోగు భారతదేశమును గురించి వేఱ చెప్పవలయునా? అయినను ప్రభుత్వమువారు తగినంత శ్రద్ధవహించి ప్రజా సముదాయమునకు వలసినన్ని సౌకర్యముల నేర్పాటు చేయుచున్నారు. ఇందులకు వారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు. కాని దొరతనమువారి దయావీక్షణము ఉపాధ్యాయులపైఁ జక్కగా ప్రసరించుటలేదు. వీరును తమసిబ్బందిలోనివారేయని భావించి తమసిబ్బందికిఁ గలిగించిన సౌకర్యములను, తమ సిబ్బంది కొసంగిన కఱవుబత్తెములను, వీరికిఁగూడ నొసంగవలెను. ఇట్టిది జరుగలేదనియే నేటి యుపాధ్యాయుని ఆందోళనము!

ఇదివఱకు గావించిన ఆందోళనమునకు ఫలితముగా నేటి ప్రాథమికోపాధ్యాయునకు రెండు రూపాయలు కఱవుబత్తెము లభించినది. దీనితోఁ గలిపి అతని జీతము 16 రూ॥లకు మించుటలేదు. ఈస్వల్పవేతనములో రెట్టికి మూఁడురెట్లుగా ధరలు పెరిగిన యీ కఱవురోజులలో అతనిదైనందిన జీవితము గడచుటెట్లు? ఎంతతక్కువ అంచనా వేసినప్పటికి ఈరాబడి నెల మొత్తమునకు సరిపోవునా? సరిపోనిపక్షమున అతడు తన విధిని సక్రమముగా నెఱవేర్చుటయెట్లు? పాపము! అతని జీవితపటము నొక్కమారు తిలకింపుడు పోషింపవలసినది పెద్దకుటుంబము. పాలింపవలసిన నిబంధనలు తలమున్కలు. జోహారులర్పింపవలసినది తలవెండ్రుకలంతమందికి భయపడవలసినది చిన్నమొదలు పెద్దవఱకు అంజలపట్టవలసినది అందఱికి ఎప్పుడే యధికారి తనిఖీకి వచ్చునో, ఎప్పుడే మెంబరువచ్చి పిలుచునో, ఎప్పుడేపోరుడు ఆకాశగామన్న రిపోర్టులు వ్రాయునో, యని నిరంతరముతహతహ. ఇన్నింటికి తోడుగా ఒకటివ్రేలతో నంజుటకేని చాలని రాబడి. ఆతనిదురవస్థ యెంతని వ్రాయగలము. ఇన్నింటి మధ్య జిక్కి యతఁడు గానుగలోని నువ్వుగింజవలె నలిగిపోవుచున్నాఁడు. ఇట్టియెడ శల్యావశిష్టుఁడగు నితని వద్దనుండి విద్యాతైలమే కాయునో యేమో కలపాడియే రాలునో చెప్పలేము.

గురు సంప్రదాయ మింతటిదుస్థితి పాలగుటకు ముఖ్యకారణములు — ప్రజానీకముయొక్క నిరాదరణ, ప్రభుత్వముయొక్క చిన్నచూపు నేటి యుపాధ్యాయవృత్తి "బ్రతుకలేక బడిపంతులు" అన్నసామెతగా పరిణమించినది ఈ భావము ప్రజా హృదయమునుండి తొలఁగనంతవఱకు గురు పదమునకు రాణింపులేదు, గౌరవమునులేదు. అది తొలఁగవలెనన్న ఉపాధ్యాయుని ఆర్థిక పారతంత్ర్యము సమూలముగా నడుగంటిపోవలెను. ఇందులకు ప్రభుత్వము పూనుకోవలెను. అనఁగా ఉపాధ్యాయుని రాబడిని హెచ్చించి అతనికి కుటుంబపోషణమును గూర్చినచింత ఆవంతయును లేకుండ చేయవలెను. ఇది మొదటిది రెండవది స్వేచ్ఛ- అనఁగా బోధనా పద్ధతులయందును, పాఠ్యగ్రంథ నిర్ణయములోను, ఉపాధ్యాయునకు వలసినంత స్వాతంత్ర్యముండవలెను. తాను తరిఫీదుచేయు బాలబాలికల మానసిక పద్ధతులననుసరించి, అభిరుచుల గ్రహించి, వృత్తిధర్మములగుర్తించి, అతఁడే తగిన బోధన సామగ్రిని సమకూర్చుకొనగలఁడు ఇట్టి ఆర్థిక సుస్థితి, స్వేచ్ఛ, ఉపాధ్యాయున కెప్పుడు చేకూరునో నాటినుండియే సక్రమమైన విద్యాభివృద్ధి యేర్పడగలదు. ఇవిలేనినాడు ఎన్ని నిబంధనలున్నను, ఎంతమంది పరీక్షాధికారులున్నను, విద్యాభివృద్ధి గొఱ్ఱెతోకవలెనే యుండును.

పూర్వపు రోజులలో సంఘమున గురువున కున్నంత గౌరవము మఱియేవ్యక్తికిని లేదు. రాజాధిరాజులుగూడ గురువులకు దాసోహమ్మనినారు. తమబిడ్డలను వారి యాశ్రమములకుఁ బంపినారు. తమకంటె నెక్కువగా వారిని చూచి వారికే కొఱతయుఁ గలుగకుండ పోషించినారు, వేదధియంత్రయు

విపరీతమైనది గురువే నేఁడు దాసోహమ్మను చున్నాఁడు గురువే నేఁడు శిష్యునింటికిఁ బరువెత్తు చున్నాఁడు గౌరవమున్నను లేకున్నను పొట్టకక్కుఱితికై యెంతటి నైచ్యమునకైన తలయొగ్గి పని చేయుచున్నాఁడు ఇది జాతికి శుభదాయకమో, అధఃపతనమునకుఁగారణమో, అనుభవజ్ఞులే చెప్ప వలయుఁగాక!

ఏప్రభుత్వమునకైనను ప్రాథమికోపాధ్యాయుడు పట్టుగొమ్మ ఇతనిని నిరసింపరాదు నిరాదరింపను రాదు ఇతని శిక్షణము క్రిందనే దేశనాయకులు, దేశసేవకులు, దేశవీరులు, మహామంత్రులు, మహా రాజులు, తయారగుచున్నారు ప్రాథమికోపాధ్యాయుఁడన్న నిర్లక్ష్యము చేయఁదగిన వ్యక్తిగాడు అతఁడు సంఘములో అసాధారణ పురుషుఁడు తన శిక్షణ క్రిందజేరు బాలబాలికల విరుద్ధహృదయ క్షేత్రములను తన నిశితబోధనా హలముచేఁ జక్కగాదున్ని, విద్యామృతముచే, బదనుచేసి, ఉత్తమ భావబీజములనాటి, కాలక్రమముగఁబెంచి, విశిష్టమగు దేశీయసంపదను బెంపొందింపఁజేయు ఉత్తమ హాలికుఁడు ఈహాలికుఁడు సుభిక్షముగా నున్నప్పుడే దేశమన్నివిధముల సుభిక్షముగా నుండును

ఈ సూత్రమును పాశ్చాత్యదేశములన్నియు-అందులో ముఖ్యముగా రష్యాదేశము - చక్కగా గుర్తించినది నేఁడు రష్యాలో జరుగుచున్న తీవ్ర యుద్ధ ప్రతిఘటనమునకు మూలకారణము ప్రాథమికోపాధ్యాయుని యుత్తమ కృషియే! ఇతర సంపద లెన్నియున్నను, ఎంత యెక్కువగానున్నను, విద్యా సంపదలేకున్న రష్యాయింతగా ప్రతిఘటించియుండ లేదు రష్యాలోని బోధకుఁడు ప్రభుత్వమునకు దగ్గఱి చుట్టము అతనికేలోటుయును లేదు అతఁడు నిరంతర సుఖజీవి సంఘమునకాదర్శపురుషుఁడు కావుననే అతని యుత్తమకృషి నేఁడు జగద్వినుత మైనది ఈసూత్రమును భారతదేశముగూడ నేఁడు గుర్తింపవలెను ప్రాథమికోపాధ్యాయుఁడు ప్రభుత్వ మునకు దగ్గఱిచుట్టమై నిరంతరసుఖజీవి కావలెను అప్పుడతఁడు ప్రభుత్వమువారి యుద్ధప్రయత్నము లకును, మిత్రమండలివారి అఖండవిజయమునకును. దేశమును తయారుచేయఁగలఁడు

అదిరేమికర్మమోకాని ఒక్కయుపాధ్యాయుని జీవితమునందు మాత్రమే నేటిదారిద్ర్యమంతయు మూర్తీభవించినట్లున్నది. ప్రాథమిక పాఠశాలలలో నేమి, ఉన్నత పాఠశాలలలో నేమి, పనిచేయు నుపాధ్యాయులెల్లరు సగము మాడు కడుపులతో, ఒంటిపూటపస్తులతో. పనిచేయుచున్నారన్న వింత గాదు ఏవిద్యాసంస్థలోను తల్లిదండ్రులు ఉపాధ్యాయుల నియమించునప్పుడు వారి గుణశీలములను గుర్తింపరు పాండిత్యమును పాటింపరు బోధనాపటిమను లెక్కింపరు వారికిఁ గావలసినది జీతపుతక్కువయే! ఎంతతక్కువ జీతమునకుఁ గుదిరిన అంతమంచిది ఎక్కువజీతమడుగువారికి ఎంతసమర్థత యున్ననుసరే ఉద్యోగప్రాప్తిలేదు ఈ విధముగా రాను రాను ఉత్కృష్టమైన యుపాధ్యాయ వృత్తి బేరములోనికి దిగి గౌరవహీనమై అతినీచమైపోయినది కడుపు చిచ్చు నార్పుకొనుటకు వేఱుపాధిలేక అతక్కువ జీతమునకే ఉపాధ్యాయుడు తలయొగ్గి పనిచేయు చున్నాడు.- కాని ఈయుపాధ్యాయుడుత్తమ విద్యను బోధింపఁగలఁడా? అసలు తక్కువ జీతమునకును, ఉత్తమ విద్యాబోధనమునకును, పొత్తుకుదురునా? ఈప్రశ్నకు సమాధానముగా నొక ఆంగ్లపండితుడు ఏమివ్రాసినాడో చూడుడు.—

"I believe, and an increasing number of other people are beginning to belive, that education lies at the root of happiness for every people Worthy education is impossible where inferior teaching forces are employed, and only inferior teaching forces can be secured where inferior pay is offered Where teaching is inferior, good government cannot be expected"

"నేనేగాక మఱియితరులు పెక్కుమందియు, ఉత్తమ విద్యకు ప్రతివ్యక్తి యొక్కసుఖప్రవృత్తియే మూలకారణమని నమ్ముచున్నారు ఎచ్చట తక్కువ స్థాయి గల విద్యాశక్తులు నియమింపఁబడునో అచ్చట ఉత్తమవిద్య లభింపఁజాలదు. తక్కువ స్థాయిగల విద్యాశక్తులు నియమింపఁబడుటకు తక్కువ వేతనమే కారణము. ఈరకపు విద్యాశక్తులు పనిచేయు చోట ఉత్తమ ప్రభుత్వమునకుఁ దావులేదు."

దీనినిబట్టి తక్కువ వేతనమునకుఁ గుదురు ఉపాధ్యాయుఁడుత్తమ విద్యను బోధింపఁజాలఁడు ఇట్లనుటలో అతనికి శక్తిసామర్థ్యములు చాలవని కాదు తెలివితేటలు లేవనియుఁగాదు అతనికి సుఖప్రవృత్తి లేకపోవుటవలన మనశ్శాంతియుండదు మనశ్శాంతి లేనినాఁడు చిత్తప్రవృత్తి నిశ్చలముగా, నిర్మలముగానుడండు. అట్టియెడ నతఁడుత్తమ విద్య బోధింపఁజాలడనుట నిర్వివాదాంశము కాబట్టి ప్రభుత్వము వారు కలువుబత్తెమును హెచ్చించికాని, సార్జెంటు కమిటీవారి సూచనలను వెంటనే అమలు పఱచికాని, ఉపాధ్యాయలోకమునకు సరియైన సక్రమమైన సుఖప్రవృత్తిని గలిగించి తన్మూలమున దేశములో విద్యా సంపదను సర్వతోముఖముగా పెంపొందింతురుగాక! —సంపాదకుఁడు

దీ 9-1-43 న నెం 153 రు గల శ్రీ డైరక్టరువారి ప్రొసీడింగ్సు సరియగు నకలు. అంశము కంప్లీటు లోయరు ఎలిమెంటరీ (కం, లో. ఎ.) స్కూల్సు లోని హెడ్మాష్టర్ల యోగ్యతలు, అర్హతలు.

ఈ ప్రొసీడింగ్సు యీ అంశముపైగల పూర్వపు టుత్తరువుల నన్నిటిని రద్దు చేయును. 1—10—39 నాటికి కం. లో. ఎ స్కూల్సులో హె. మా. గాపనిచేయు చున్న హయ్యర్ గ్రేడు టీచర్సును, 16-9-33 నాటికిగాని, అంతకు ముందుగాని, హె. మా॰ గా 2 సం॥ ల సర్వీసు గలిగిన తక్కువ అర్హతలుగల టీచర్లను, 1-10-39 నాటికి కం లో. ఎ. స్కూళ్ల హె మా. గా పనిచేయువారు ఆ స్కూళ్ల టీచర్ల సంఖ్య పరిమితితో నిమిత్తములేకుండ, ఆ పాఠశాల 4 గురు, 5 గురు టీచర్లుగల స్కూలుగా అభివృద్ధి చెందినను హె. మా. గా ఉండవచ్చును.

అట్టి హె. మా. ఒకే యాజమాన్యము నందలి 4 గురు, 5 గురు గల ఒక కం. లో. ఎ. స్కూలునుండి అట్టి మరొక స్కూలుకు 1-10-39 తరువాత బదిలీ అయినచో హె. మా. సర్వీసులో "బ్రేకు" (Break) లేనిచో హె. మా గా పని చేయుచుండుటకు అనుమతింపబడవచ్చును అట్టి హె మా. మరొక యాజమాన్య ములోగల 4 గురు, 5 గురు టీచర్లుగల కంప్లీటు స్కూలుకు ఉండవీలులేదు. కాని ఆ స్కూలులోనే పనిచేయుచుండగా యాజమాన్యములో మార్పుగలిగిన అతడు హె. మా గా పనిచేయుచుండ ననుమతింప బడవచ్చును.

అట్టి హె. మా. అదే యాజమాన్యమందుగల 4 గురు కంటె తక్కువ టీచర్లు గల స్కూలుకు బదిలీయైనచో తిరుగ 4 గురు, 5 గురు కంటె ఎక్కువ టీచర్లుగల స్కూలులో హె. మా. గా నియమింపబడకూడదు. కాని అవసరము వెంబడినివేయ వలసివచ్చినచో రికగ్నేషను నిబంధన 12 (3) ప్రకారము ఎగ్జెంప్షను పొందవలయును.

1-10-39 నాటికి 4 గురు కంటె ఎక్కువ టీచర్లుగల అసంపూర్ణ పాఠశాలలలో (సెకండరీకాక యితరగ్రేడ్ల) హె. మా. ఆ స్కూలు 1-10-39 తరువాత కంప్లీటు స్కూలుగా మారినచో హె. మా. గా నుండరాదు. కాని ప్రత్యేకవిశిష్టత (అర్హత) గలవారు రికగ్నేషను నిబంధన 12 (3) ప్రకారం ఎగ్జెంప్షను పొందవచ్చును.

అసలుకు సరియైన నకలు:—ఉపాధ్యాయుల Information కొఱకు, మేనేజర్ల ఉపయోగార్థము కావింపబడినది.

Ch K· S Sarma, కార్యదర్శి, తూ. గో. జిల్లా టీ. సం. సంఘము.

## శ్రీ ఆచార్య సింహాగారి "బహిరంగలేఖకు" జవాబు

అయ్యా !

తాము రచించిన 1943 మార్చి, ఏప్రిలు నెలలలో ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యలో ప్రకటింపబడిన లేఖల చదివితిని మీ బహిరంగ లేఖకు నాకు తోచిన జవాబు నీదిగువ పొందుపరచు చున్నాను

మీరు వ్రాసినట్లు ఒక (స్థితి) బడిని ఊహింపగలిగితిని గాని అట్టి పరీక్షాధికారిని ఊహింపలేకున్నాను. ఏమన సాధారణముగా సెంటరుగల దినమున బడి సాలుసరి పరీక్షచేయువారిని గానను ఒకచో చేయదలచితిన ఆబడి సెంటరు క్లాసు జరుగు గ్రామములోనిబడియో లేనిచో అతిచేరువగు మరొక గ్రామములోని బడియోమాత్రమే యైయుండును దానికైనను క్రిందటి దినము సాయంకాలమే వచ్చును అందుచే సెంటరుక్లాసునకు టీచర్లు వెళ్ళకుండునంతటి అవకాశము లభింపదు.

ఇక మీరు వ్రాసిన పరిస్థితులలో బడిపరీక్ష జరుపు ఉద్యోగి వివేకము నేమన వలయునో తెలియదు. అట్టి పరిస్థితులలో పరీక్షజరుపదలచినచో ప్రధానోపాధ్యాయుడు తనఅసమ్మతి తెలిపినచో పరీక్షమానవలసినదే అట్లు మాననని ఆయనపట్టుబట్టిన వ్రాతమూలకముగా తన ఆర్డరు నిమ్మని తనయిచ్చవచ్చినట్లు పరీక్షచేసికొననిమ్మని సదరు రిపోర్టు కాపీతో తన అసమ్మతిపై పరీక్షజరుపబడినట్లు వెంటనే పై అధికార్లకు H M. తెలుపుటమంచిది పరీక్షకు హాజరుకాని టీచరు సెంటరుకు హాజరయినచో అది డ్యూటీగానే భావింపబడవలెను తగినంత వ్యవధిలేక పరీక్షకు వచ్చుట ఆ ఉద్యోగి తప్పుగాని టీచరుపట్ల యేవిధముగానూ నేరారోపణ జరుపవీలులేదు. జరిపినను నిల్వదు.

---

# బాలనీతిశతకము

అష్టమ దశకము

విద్యార్థి లక్షణములు - సాంగత్యము

(గతసంచిక తరువాయి)

బాలకవి . వాకాటి పెంచలరెడ్డి

తే. గీ తల్లిదండ్రుల భక్తితోఁ దలఁచవలయు, వారిమాటల కెదురాడ తీరుగాదు
పరమభక్తిని నెంచు తత్పాదములను, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద 1

తే గీ 'గురుఁడు చెప్పెడి పాఠముల్ కోరిచదువు, వారి యాజ్ఞల మన్నింపు భావమందు
గౌరవమున (జేయుము) నమస్కార మెపుడు, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 2

తే. గీ. దారి దప్పిన బాలుర దారిఁ బోక, అందు నిందును స్వేచ్ఛగా నరుగఁబోక
విద్యమఱువక కేళిలో వీసమేని, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 3

తే. గీ. ప్రొద్దున నెలేఁచి స్నానంబు పొనరజేసి, దైవమును భక్తితోడుతఁ దలఁచి యంత
అధికభక్తి గురునివద్ద కరుగవలయు, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 4

తే. గీ. పాఠముల్ శ్రద్ధతోడుత పఠనసలుపు, నలిపెనంతనె మదియందు సంతసిలకు
మాటిమాటికిఁ జదువును మఱువకెపుడు, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 5

తే. గీ. అద్దమట్టిది హృదయంబు నిద్దమగుచు, దానియందున సుజనదుర్జనవాళి
భవ్యదుర్గుణజాలంబు ప్రతిఫలించు, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 6

తే. గీ. మంచిచెడ్డలు గలయట్టి మనుజవితతిఁ, గలిసి యారీతినే యగు నిలను నరుఁడు
తాలిశ్ బట్టి గాలిచందంబుగాను, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 7

తే. గీ. హంత భక్తుండు హర్తయే న్యాయకీర్తి, దుష్టగుణ శిష్ట జనుఁడుగా స్పష్టగతిని
బరగువారలు సుజన సంబంధ వశత, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 8

తే. గీ. మార్దవాత్ముండు తలఁప నమ్మార్దవుఁడుగ, శిష్టగుణజాలగణ్యుండు దుష్టుఁ డగను
వరలువారలు దుష్ట సంబంధవశత, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 9

తే. గీ. కలదుమైత్రికిఁ దాఘంభకారగుణము, అతఁడుతనయిచ్ఛఁ గుండలఁజతనపఱచు
నట్లు మైత్రియు సృష్టించు నాత్మమిత్రు, సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద! 10

---

# భూగోళ ప్రశ్నోత్తరములు

(జనవరి సంచిక తరువాయి)

వేదాన్తము శ్రీనివాసాచార్యులు, హెడ్‌మాష్టరు, ఆత్కూరు

**7 వ త ర గ తి**

ఋతుపవనము, ఋతుపవన ప్రదేశములు, నిమ్నోన్నతములు, జనులవృత్తులు, నాడీమండల దీవులు.

ప్ర : 1. ఋతుపవనము లననేమి?

జ : వర్షవాయువులకు పవనములని పేరు. ఇవి కొన్ని దేశములందు నియమిత కాలమున వీచుటనుబట్టి ఋతుపవనములని పిలువఁబడుచున్నవి.

2 : మన ఖండమందలి ఋతుపవన ప్రదేశములెవ్వి?

జ : హిందూదేశము, సయాం, ఇండోచైనా, చైనా, జపాను.

3 : మన ఖండమందలి పర్వతశ్రేణుల జన్మస్థానమెద్ది ?

జ : మన ఖండమందలి పామీరు పీఠభూమి.

4 : ఋతుపవన ప్రదేశములందు ముఖ్యవృత్తియెద్ది ? కారణమేమి ?

జ : వ్యవసాయము ముఖ్యవృత్తి. ఋతుపవన ప్రదేశములందు గల నదీమైదానములు, (2) సారవంతమగు భూములు, (3) వర్షము.

5. ఋతుపవన ప్రదేశములలో జపానుపరిశ్రమలయందు వృద్ధిగాంచుచున్నది. కారణము లెవ్వి ?

జ : జపాను దీవులందు నేలబొగ్గు, ఇనుము దొరకును, (2) తీరరేఖ చీలియున్నది. (3) స్వతంత్రదేశము. (4) శీతోష్ణస్థితి.

6 : జపానుదేశములో జరుగు ముఖ్యపరిశ్రమలెవ్వి ?

జ : ఉక్కు, గాజుసామానులు, ఆటవస్తువులు, బట్టలనేత, పట్టుపరిశ్రమ, తీరప్రాంతమున చేపలవేట.

7 : నాడీమండల దీవులెవ్వి ? వానికిగల యితరపేరేమి ?

జ : సుమిత్రా, జావా, బోర్నియో, ఫిలిపీన్, ఉష్ణమండలపు దీవులు.

8 : ఉష్ణమండలపు దీవులని పేరేలగల్గెను ?

జ : ఈ దీవులగుండా భూమధ్యరేఖ పోవుచున్నది. ఇవి ఉష్ణమండలములోనుండుటచే వానికీ పేరుగల్గెను.

9 : ఉష్ణమండల దీవులలో వేసవి, శీతాకాలమందలి ఉష్ణోగ్రతాభేదమధికముగనుండదు ? కారణమేమి ?

జ : 1 ఋతుపవనములు వీచుమార్గమున నుండియుండుట, (2) ఇచట సంవత్సరము పొడవునను వర్షము కురియుచుండుట (3) దీవులు.

10 : దీవులందు అరణ్యములు హెచ్చు ! కారణములెవ్వి ?

జ : ఉష్ణప్రదేశము, (2) నిరంతరవర్షము.

11 : దీవులందు జరుగు పరిశ్రమలెవ్వి ?

జ : రబ్బరుపరిశ్రమ, సగ్గుబియ్యము, చెఱకు. సింకోనా, సుగంధద్రవ్యములు.

(సశేషము)

---

# "పల్లెటూరి పంతుళ్ళ మొఱ."

(బి. వి. సుబ్బరాజు)

"బ్రదుకలేనివాడే బడిపంతులు" అను సామెత విశేష ప్రచలితమై ప్రాతబడిపోయినది. ప్రస్తుత విద్యా ప్రణాళికయంతయు నభివృద్ధికరమగు అంకెలను నగుపరచి, ఐక్యకంఠముతో నందఱును సభాసనునటుల ఉపన్యసించుటకును, నివేదికలను ప్రకటించుటకును, పనికి వచ్చునదే గాని ఫలితమున శూన్యముగా నుంటున్నదనుసంగతి సర్వజన విదితము, "సర్వంవిష్ణుమయం జగత్" ను లాగు నంతటను సెలబస్సు, బడి దినములు, పనిచేయుకాలమున నొకటిగానుండుట గననగుచున్నది. ఇందుచే దయామయులగు మన శ్రీ విద్యాశాఖవారీ దేశమందలి నిరక్షరాస్యతను రూపుమాప నేకరూపమున సమిష్టి మార్గమును నిర్ణయించిరే కాని ఇందుచే పల్లెగ్రామనివాసుల కిందెట్టి యాటంకములు గలుగునో యను విచక్షణ నొకింత యవకాశ మీలేదేమోయని యనుకొన వలసివచ్చుచున్నది.

విద్యావిధానములో నందు ముఖ్యముగా భూగోళ, ప్రకృతి పాఠముల సెలబస్సు నీ పల్లెటూరి పసిపాపల పాతాళమున కీడ్చులాగున్నది. భూగోళపాఠ బోధనమున కుపాధ్యాయుడు బ్రహ్మాండమును పరిశోధించి యుపకరణముల సేకరింపవలసి వచ్చుచున్నది, బోధకుని తల బ్రద్దలుగా గొట్టుకొన్నను పాఠ్యాంశములు వారిబుఱ్ఱ కెక్కవు. ప్రకృతి వర్ణనము చేసి వారిభావిజీవితము, ప్రకృతిసిద్ధముగ గడువ బెట్ట తయ్యారొనర్పవలసియున్నది. ఇంతకన్న మన వేదాంతుల ననుసరించి "ప్రకృతి నిరసించి పరమేశ్వరునందు దృష్టి మరలింపజేయుట సులభమేమో యని తోచుచు. గణితబోధన 4 5, తరగతుల కోర్సులోనే నంతయు నిమిడ్చి యుపాధ్యాయుని నటమటింపజేయుచున్నది. భాషాబోధనములో నిశ్చితకొక్క దవకాశమిచ్చుట ముదావహమే గాని యిదియును తాహతును మించియేయున్నది. చేతిపనుల విషయమై చెప్పనక్కరయే లేదు. పాఠ్యక్రమ పట్టికలీలాగున్నవి.

పాఠశాలా పరికరములనగా బోధనోపకరణము లాదిగా గలవి యొనగూర్చు పనిబోలెడంత యున్నది. వానిని సమకూర్చుటలో జెందిన వ్యయప్రయాసలు, ఉపకరించుటలో సంతసమొనర్చ జాలకున్నవి. ఇక రికార్డువిషయమై వివరింపబూనితి మేని యిదియొక పెద్దగ్రంథమగును. స్టాగ్నేషన్ లిస్టులను స్ఫురింపజేసుకున్న ఉపాధ్యాయుని ఒళ్లు జలదరించును. రికార్డుషీటులను తయారుచేయుట బండచాకిరి. గాజులయ్యవలె బ్రతిగృహమును దిరిగి బాలబాలికల జనాభాప్రాసి పెట్టవలయును. బడి వయస్సు గల బాలబాలికలన్న పోషకులిదేమిటీ యయ్యవార్లగోలయని, "మావాడీయూరనుండడు" మామగారి యూరనో లేక పెద్దమ్మగారి గ్రామముననో నుండునని చెప్పువారు గలరన్న నాశ్చర్యము జెందకుందురు గాత! ఇట్టిచో వీరికేమి? రారంపయ్యా? పేరంట్సు కమిటీ కనివర్తమానించిన రానేరారు అథవా వచ్చిరా మీ వ్రాతకోతలు కానివ్వండి మాకుపని గలదు పోవలెనందురు. వీరితో నేమని చెప్పుకొనవలయునో గదా! పంతుళ్లగోడు బాప పరమేశ్వరునకు తప్ప తదితరులెరికిని సాధ్యపడదేమో? యని తోచును.

గ్రామమందలి జనాభాకు తగినట్లు బాలురను పాఠశాలలో ప్రవేశపెట్టి 4, 5, తరగతులు మొదటి తరగతికి $\frac{1}{4}$ సరిపెట్టుకొనుటవలనే తలప్రాణము తోకకువచ్చుచున్నది. ఇంకను $\frac{1}{4}$ సంఖ్యగల బాలుర ప్రవేశపెట్టుట కష్టసాధ్యముగా నుంటున్నది. స్టాగ్నేషన్ బెడద, దప్పించుకొనుటకై రికార్డుషీట్లలోని అంకెలను కన్నతియైన జాడకుండ ప్రమోషనులొనర్పవలసివచ్చుటచే నుపాధ్యాయునికిది "తప్పొనర్పని దండనము" గా నుంటున్నది. తిరుమలకొండకేగి శ్రీ స్వాములను దర్శించి దండము బెట్టుకొన్న తప్పులన్నియు క్షమింపబడునను బెట్టు నమ్మకము ప్రతీతి ఏర్పడినదో యట్లే బోధకుల పాలిటికీ స్టాగ్నేషన్ బాధితాలో లేక బాలబాలికలను సక్రమముగా బడికివచ్చుట శ్రద్ధతో జదువుకొన నీదేవునికి మ్రొక్కుబళ్ళని చెల్లింపవలెనో తెలియుటలేదు. అందుచే నిది యనుమానాస్పదుడగు నేరస్థునివలె శ్రీ విద్యాశాఖవారితని నొనర్చిరని నిక్కముగా నేల దలంపకూడదా? యని వేసనుకొనుచున్నాను.

ఎక్కడను స్టాగ్నేషను యేర్పడినను గ్రామమందలి బాలబాలికలు 4-5 తరగతులలోని నిష్పత్తియు, ఆకస్మిక తనిఖీలందలి హాజరును విద్యావిధానము నకు తలంచినట్లు అభివృద్ధి సూచకములుగాక యుపాధ్యాయుని పాలిటి కుతంత్రాలైపోయినవి. ఇక సెలవుల జాబితాలు పనిలేని వేసవిసెక్కువ దినములు గలిగి యుండి పంటకాలమున కొద్ది కాలమే యుండుటచే నిదియు గొప్ప బెడదయే యైనది. వీటినన్నిటిని పరిచూచుకొన్న విద్యాభివృద్ధి గలిగించుటకు గగన కుసుమమై పోవుచున్నది. పల్లెటూరి వానుల యొక్కయు, పరీక్షాధికారుల యొక్కయు, పాఠశాలా యజమానులయొక్కయు, తృప్తికై పంతులు ప్రాకులాడుట తప్పనిసరియైపోయినది. దీనికి తోడు "గోరుచుట్టుపై రోకలిపోటు" వలె మాటిమాటికి బదిలాయింపులు. వీటిని పరిచూచు కొని సంచారమొనర్చుచూ, పాఠశాలనునిర్వహించు కొనుట జూడ నుత్తరరామచరితమందలి విప్రునకు కాలాంజన పర్వతమందలి దేవాలయార్చనమునకు శ్రీరాములు శిక్షవిధించినరీతి నీయుజ్జలకును బ్రహ్మదేవుడిట్టి విధానముల గల్పించెనని తోచుచున్నది.

ఈ బీదపంతుళ్ల గోడవలన్నిటిని వ్రాసి విసిగింప తల్లపడనుగాని ఇతనికై యొనర్పవలసిన సదుపాయ ములను గొన్నిటిని క్లుప్తముగ వివరించెదను. 1. స్టాగ్నేషన్ జాబితాలను రికార్డు షీట్లతో జూచి సం॥రమున కధమము 3/4 హాజరుండకున్న 3 సం॥ర ములవఱకు మినహాయించుట. 2. గ్రామమందలి బాలికలకు బదులు పాఠశాల బాలురలో 1/4 బాలికలుండవలయుననుట. 3. సెలబస్ లోని భూగోళ, ప్రకృతి, గణిత పార్యముల గొంతవరకు తగ్గించుట. 4. సెలవులిస్టులో హంగామి కాల మెక్కుడు దినములు సెలవులిచ్చుట. 5. రికార్డు షీటుతో నవసరము లేకుండ బాలబాలికల పరీక్షించి పాఠశాలలో ప్రవేశపెట్టుకొనుట. 6. స్థానిక విద్యాలయములలోను నీచరునకు 20 సరాసరి హాజరుండు లాగుననూ. 7. మొదటి తరగతిలోని 1/4 నిష్పత్తిని తగ్గించి 4-5 తరగతులలో 1/5 నుండుటకును, దయామయులగు శ్రీ విద్యాశాఖవారును, విద్యావేత్తలును, పర్యాలోచించి యీ పల్లెపంతుళ్ల (పట్టణముల మినహాయించియైననూ.) నుద్ధరింపవలెనని ప్రార్థన పూర్వకముగ విన్నవించుచున్నాను.

---

# విద్యాప్రబోధము

(రచయిత : చిలకా వెంకట కృష్ణదాసు)

"రైతుకే ఓటివ్వవలెనన్న నీబిడ్డలకు నిల" అను వరుస

1. విద్యయే భూషణము సుమ్మన్నా !
   నీబిడ్డలకు భువి
   విద్యనే చెప్పించు మోయన్నా !
   విద్యయే జ్ఞానంబు నొసగును, విద్యయే వినయంబు నొసగును
   విద్యవలననె గౌరవంబును పొందుచుండిరి మాన్యులందరు॥ విద్య॥

2. ధనము శాశ్వతమనుచు నమ్మకుమీ
   నీ ధనంబంతయు
   దొంగలకునో దొరలకో సుమీ
   ధనములన్నిటికంటె గొప్పదియైన విద్యాధనము నెవ్వరు
   దొంగిలించగలేరు సుమీ శాశ్వతంబుగ నుండు-సుమీ॥

3\. విద్యయే పరమార్థసాధనమూ
మానవుల కిలలో
విద్యయే సకలార్థసాధనమూ
విద్యయే పరదేశబంధువు విద్యయే రూపంబు తోడవును
విద్యయే మనకామితంబుల నొసగ నిలలో కామధేనువు॥ విద్య॥

4\. విద్యయే కలిదంద్రిగురువన్నా!
యీ విద్యవలననె
సద్యశంబును బొందగల మన్నా!
విద్యలేని మనజు డిలలో పశువుతో సమమనుచు నుడివిరి
విద్యకొరకై బడులలోనికి పిల్లలను పంపించు మన్నా - విద్య॥

---

# వేడికోలు

చిలకా వేంకటకృష్ణదాసు

గీ. అమృతవారాశి జన్మించి యాదివిష్ణు । వక్షమందున నిలిచిన భవ్యమూర్తి!
ఇందిరాదేవి! శ్రీలిడి యెల్లవేళ । లందు బ్రోవవె యొజ్జల నమితకరుణ.

గీ. కడుపుతో క్రుంగి కృశియించి కడుపుమాడి । వేడికన్నీటిధారల విడుచునట్టి
పేదయొజ్జలపై నీవు విశ్వజనని! । త్వరగ కరుణాకటాక్షమున్ బరపుమమ్మ!

గీ. అంబరంబులులేక యిల్లాలు పిల్ల । లెల్లరును గుండ గుండెలో జల్లుమనగ
అశ్రుకణములతో తర్పణాంజలు విడు । పేదయొజ్జల బ్రోవుము విమలలక్ష్మి!

---

# ఉపాధ్యాయుడు - గ్రామసేవ

1\. భారతదేశము కృషిప్రధానదేశము. ఈదేశములోని జనులలో సగముపైగా గ్రామములలో నివసించుచున్నారు కొన్ని కారణములవలన వీరిఆర్థికస్థితి చాల దుస్థితిలో నున్నది. ఎక్కువశ్రమపడినప్పటికిని కొట్టుకొలది గ్రామవాసులకు తినుటకు కడుపునిండా దొరకుట దుర్లభముగానున్నది. గ్రామవాసులస్థితి బాగుపడితేనేగాని మనదేశము సౌభాగ్యవంతము కాజాలదు. ప్రభుత్వమువారు, గ్రామములోనివారు, ప్రజలు సహాయపడినట్లయితే దానిదశ బాగుపడగలదు. గ్రామములోని విద్యార్థులు, ఉపాధ్యాయులుకూడ, యీ గ్రామకను పునరుద్ధరించుటలో తోడ్పడవలెను.

2\. ఈ వ్యాసములో ఉపాధ్యాయులు, విద్యార్థులు, ఎట్లు గ్రామసేవాకార్యమును నిర్వహించవలెనో నాకు తోచినవి కొన్ని చెప్పుచున్నాను. మొదట ఉన్నత తరగతి విద్యార్థులు, ఉపాధ్యాయులు, ఒక సంఘముగా ఏర్పడవలెను. ఈసంఘసభ్యులు యోచించుచుగా ప్రతివారము ఒక సారి చుట్టు ప్రక్కల గ్రామములకు వెళ్ళి, ఆ యా గ్రామముల దుస్థితులను కనిపెట్టి వాటిని చక్కబెట్టుచుండవలెను. ఆదివారము ఉపాధ్యాయులకు విద్యార్థులకు అందరకు అందుబాటైనరోజు కనుక నెలకు మూడుపర్యాయము లైనను యీపని నిమిత్తము చు పక్కల గ్రామములకు వెళ్ళవలెను

ఉపాధ్యాయులలో ఒకరిని అధ్యక్షునిగను, మరి యొకరిని కోశాధ్యక్షునిగను, ఎన్నుకొనవలెను, ఈ ఎన్నికలు ప్రతిసంవత్సరము పాఠశాల ప్రారంభించు నప్పుడు అనగా జూన్ నెలలో జరుగవలెను.

3. ఈ సంఘసభ్యులు తొలుదొల్త యీ కార్య నిర్వహణమునకై ధనికులవద్దనుంచి చందాలు వసూలు చేయవలెను. వీరుచుట్టు ప్రక్కల గ్రామ ముల లిస్టుతీసికొని, వాటిని కొన్ని గ్రామముల చొప్పున విభజించి ఒక్కొక్క సభ్యుడు చందాలు వసూలు చేయవలెను. ఆయా గ్రామములల ఉపాధ్యా యులు యీకార్యములో సహాయ్యము చేయుదురు.

4. ఇట్లు చందాలు వసూలు చేసినపిమ్మట గ్రామవాసుల ప్రాపకము సంపాదించుట కొఱకు ఒక వైద్యశాలను స్థాపించవలెను. అందుకగుఖర్చు సంఘమువారే భరించవలెను. గ్రామస్థులకు ఉచి తముగా మందువివ్వవలెను. ఈ పని మొదట వీలు కాని యెడల వారిసానుభూతి సంపాదించు నిమి త్తము ఒక ఉచిత పఠనగ్రంథాలయమును నెల కొల్పవలెను. మొదట ఉపాధ్యాయులకు, లేక సంఘసభ్యులకు, ఏవార, దిన పత్రికలు వచ్చునో వాటిని యీగ్రంథాలయము కొఱకు యివ్వవలెను. సంఘము ప్రోగుచేసిన డబ్బుతో కొన్ని పత్రికలు తెప్పించి యుంచవలెను. దీనిని ఉత్సాహవంతుడైన ఏ ఉపాధ్యాయుడో లేక గ్రామములోని ఉత్సా హుడైన ఏ యువకుడో నడుప వలెను. దీనిని పాఠశాలలోగాని, లేక గ్రామచావ డిలోగాని, ఏదైన ఒక కేంద్రప్రదేశములో యుంచ వలెను. దీనికి అగు లైటుఖర్చు మొదలగునవి సం ఘమువారే భరించవలెను. దీనివలన గ్రామవాసులు ఎప్పుడైతే సరియైన లాభమును పొందుచుందురో అప్పుడు సంఘమువారు కొన్ని ఉత్తమ గ్రంథములను, వ్యవసాయసంబంధమైన పుస్తకములను, గ్రంథాల యములో యుంచవలెను. ఈ గ్రంథాలయము పకు తోడు రాత్రిపాఠశాల కూడ స్థాపించవలెను. ఇందు గ్రామములోని చదువుకొనివారు (adults) చదువునేర్చుకొందురు. ఇదాని మూలమున అక్ష రాస్యతను కలిగింపవలెను. ఈపని గ్రామములో ఉత్సాహుడైన ఉపాధ్యాయుడు నిర్వహించవలెను. అవసరమైన కొద్దివేతనము కూడ సంఘమువారు యీయవచ్చును. వైద్యశాల స్థాపించినట్లయిన యీపని ఆవైద్యునకే యీయవచ్చును.

5. గ్రంథాలయము, రాత్రిపాఠశాల, వైద్యశాల స్థాపించిన పిమ్మట గ్రామములోని పరిశుభ్రత పైన దృష్టి మరల్పవలెను. పార తట్ట, మొదలైనవి తీసి కొని ఈ సంఘసభ్యులే స్వయముగా తమచేతులతో పెంటప్రోగులు మొదలైనవి తొలగించ ప్రయత్నిం చినచో, గ్రామస్థులు, అందరును యీసంఘ సభ్యుల ఆదేశాను సారము చేయ మొదలిడెదరు. సాధారణ ముగా గ్రామములలోని నూతులవద్ద మురికి ఎక్కు వగా ఉండును. గ్రామము లో గోతులుండును. వాటిలో మురికినీరు నిలువయుండును. అందుచే దోమలు వ్యాప్తిజెంది మలేరియా వ్యాప్తిజేయును ఇట్టిగోతులు మొదలైనవి లేకుండునట్లు యీ సంఘ సభ్యులు చేయవలెను.

6. ఆగ్రామములో సర్కారు సహకార సం ఘము (Co-operati ve credit Society) లేకపోతే, దానిని సర్కారు సహకారడిపార్టు మెంటు సాయముతో స్థాపించవలెను. దీనివలన వ్యవసాయదారులకు వారివారి పనులకు కావలసిన డబ్బుతక్కువ వడ్డీలకు దొరకును. వారు అనవసరపు ఖర్చులనుండి కూడ తొలగుదురు.

7. ఒకవేళ ఆగ్రామములో పంచాయితీ బోర్డు లేకపోయిన దానిని కూడ జిల్లాఆఫీసరు సహాయ్య ముతో స్థాపించవలెను. పంచాయితీ ఆఫీసు స్థాపించ బడినట్లయితే గ్రామస్థులు కేవలము కోర్టులకు తిరుగ కుండ, తమ సివిలు, క్రిమనలు వ్యవహారములలో న్యాయమును అక్కడనే పొందుదురు.

8. ఈ సంఘసభ్యులు గ్రామవ్యవసాయ దారు లకు గవర్నమెంటు వ్యవసాయశాఖ సహాయ్య మున మంచి విత్తనములు సప్లయి చేయించవలెను. ఉత్తమ బీజములు వారికి సప్లయి అయిన యెడల వారిపంట ఎక్కువ అగును. దాని వలన వారిపంటకు మంచి ఖరీదుకూడవచ్చును. సాధారణముగా గ్రామ ములలో పేడను పిడకలు చేసి అంటించుచుందురు. పేడ యివ్విధముగా దుర్వినియోగమగు చున్నది. పేడ మంచి ఎరువుఅగును. దానివలన పంటకూడ వృద్ధికాగలదు. అందుచే యీసంఘసభ్యులు పేడ దుర్వినియోగము కాకుండ చూడవలెను. గ్రామ వాసుల పంటకు సరియైన ఖరీదు వచ్చునట్లుకూడ యీసంఘము తోడ్పడవలెను.

9. కాని యీసంఘసభ్యుల ప్రవర్తన గ్రామస్థు లకు అసహ్యముగానుండకూడదు. అమాయికులైన రైతులు సద్వ్యవహారములు మృదుభాషణముద్వారా శీఘ్రముగా ప్రసన్నులగుదురు, ఈ సంఘసభ్యులు

సత్ప్రవర్తకులు కావలెను. వీరుచేయు ఏకార్యము కూడ గ్రామవాసులకు హితము చేయుటకు బదులు అహితము కాగూడదు.

ఈపై వ్యాసములో వ్రాసిన ప్రకారము భారత దేశములోని ఉత్సాహవంతులైన ఉపాధ్యాయులు, విద్యార్థులు, గ్రామసేవాసంఘములు త్వరలో సాపించి యీపై స్కీము ప్రకారము కార్య నిర్వహణమునకు ప్రయత్నింతురుగాక.

(హిందీఅనువాదము)
అనువాదకుడు: వేదుల సత్యనారాయణ.

# బాల విజ్ఞానము

వేదుల సత్యనారాయణ

1. వాడవాడలు తిరుగు - గాజుల్లశెట్టి
రావోయి రావోయి - గాజుల్లశెట్టి
గాజులు తేవోయి - గాజుల్లశెట్టి
రావోయి రావోయి - గాజుల్లశెట్టి

2. తేనె గాజులుమాకు - తేవోయిశెట్టి
పాటలుపాడుచు - పచ్చగాజుల్లు
నవ్వులు నవ్వుచు - నల్లగాజుల్లు
రయముగ రయముగ - రంగుగాజుల్లు
తేవోయి తేవోయి - గాజుల్లశెట్టి
రావోయి రావోయి - గాజుల్లశెట్టి

3. ఆఓడ ఎవ్వరిది - గాజుల్లశెట్టి
ఆఓడ మాఓడ - గాజుల్లశెట్టి
ఓడలో నరుకేమి - గాజుల్లశెట్టి
బంగారు గాజుల్లు మా - బాలకోఅకు
వేగమే తేవోయి - వెండిగాజుల్లు
రావోయి రావోయి - గాజుల్లశెట్టి

# పౌర ధర్మ శాస్త్రము

(CIVICS)

కె. ఎ. స్వామి

సివిక్సు అనగా పౌరులకు సంబంధించిన శాస్త్రము. మున్ను పురములే రాజ్యములు. లెక్కకు మిక్కిలి యైయున్న పల్లెకూటములు స్వతంత్రములై సంఘముల నేర్పరచుకొని సంఘావసరముల నెంతో చక్కగ దీర్చుకొనెడివి. గ్రామసంబంధమైన మత సాంఘికారిక విషయములవారే పరిష్కరించుకొనెడివారు. జాతీయస్వరూపములనదగు నాఁటి పురములీనాడు సూక్ష్మములైనవి. ప్రపంచపరిస్థితులు తెల్లమీరినవి. సుస్వతంత్రజీవితము నశించుటచే ప్రజలు సంఘములపై నాధారపడవలసివచ్చినది. జాతీయభావపూరితములైన తొల్లింటి పురముల బాధ్యత లీనాటి రాజ్యములు వహించినవి. సాంప్రదాయసిద్ధములగు గౌరవ ప్రతిష్ఠలు మానవసవీధిని మేళనలైనవి. ఆత్మశక్తిని వ్యక్తపరచుట కాంగ్ల పాలకాలు ప్రాద్భావాకములైనవి. జీవితస్వతంత్ర్యమును నిర్మూలించు దాస్యము కుసుమ స్తబకమువలె సర్వజనుల మూరము నలంకరించినది. గ్రామపరిస్థితులను తెలిసికొను మానవుడు దూరదృష్టికలవాడై తన దేశ పరిస్థితులను గ్రహించ గమకించుచున్నాడు. పురములే రాజ్యములు నాటి పౌరధర్మశాస్త్రము పౌరుని స్వగ్రామమునకే గాక తన మండలమునకు, తనదేశమునకు, తుదకు ప్రపంచమందలి వివిధ రాష్ట్రములకు, నుపయుక్తమగునట్లుమారినది. నాగరికత పెంపొందకమున్నిటి పౌర ధర్మశాస్త్రము విశాలము గావింపబడుచున్నది. ఇదియే సివిక్సు. పుర నివాసులకు (పౌరులకు) సంబంధించినశాస్త్రము.

## సనాతనులు - అధునాతనులు

ప్రభుత్వధర్మములు, ప్రభుత్వ బాధ్యతలు, ప్రజాధర్మములు, పౌరసత్వములు, తెలియజేయు శాస్త్రము పౌరశాస్త్రము (సివిక్సు) అని తెలిసినది కదా! అచంచలమగు స్వాతంత్ర్యేచ్ఛను, నిష్కళంక మగు మాతృదేశారాధన తత్పరతను, నెలకొల్పుటయే దీనిముఖ్యాశయము. ఓట్లు వేయుట, పన్ను చెల్లించుట, మాత్రమే పౌరుని కర్తవ్యము కాదు. వానికిగల బాధ్యత లెన్నియోగలవని యాధునిక వైజ్ఞానికులు నుడువుచున్నారు. పాలనా క్రమము నేర్పఁగచుటతోనే పౌరశాస్త్రసత్వములు ముగియు లేదు. వైరములను, కక్షలను, రూపుమాపి, ఐక్య భావమును గల్పించి మత సాంఘికారిక విషయములను చక్కజేసి, వర్తక వ్యాపారముల నభివృద్ధి పరచుటకూడ, దీనియొక్క బాధ్యతయే. పౌరుడు తన కుటుంబమునకు, గ్రామమునకు, దేశమునకు, నెరవేర్చవలసిన ధర్మము వింద నేకములుగలవు ఈవిషయములన్నియు నాత నికి సంబంధించినవే. పౌరుడొక రాజ్యమునకు చెందినవాడు. రాజ్యమందాతనికి భాగధేయమున్నది. కాన రాజకీయవ్యవహారములే గాక సంఘమున కవసరమగు ప్రతిసంస్థయొక్క వ్యవహారములు వానికి తెలిసియుండవలెనని నవీనుల యభిప్రాయము.

## ప్రణాళిక

పైయాధునికుల యభిప్రాయమునే మన ప్రణాళికకూడ కలిగియున్నది. గ్రామము, గ్రామమందలి వృత్తులు, మొదలైన విషయములు, శాసనసభలు, స్థానిక ప్రభుత్వములు, స్వపరిపాలన, ఓట్లు మున్నగు రాజకీయ విషయములు, శరీరభాగములు, వాని పరిశుభ్రత, వ్యాయామము, వ్యాధులు, మొదలగు ఆరోగ్య విషయములు ప్రణాళికయందు చేర్చబడినవి

## ఆశయము

ప్రాథమిక పాఠశాలలలోని బాలురైదవ తరగతిని విడిచిపెట్టుసరికి $10\frac{1}{2}$ సంవత్సరముల ప్రాయముగలవారై యుందురు. ముక్కుపచ్చలారని లేత వయస్కులైన వీరి యందధిక సంఖ్యాకులు గ్రామీయులగుటచేతను నిరుపేదలగుటచే తమ ఉన్నత విద్యను బడయజాలరు. హిందూదేశముయొక్క భావ్యభివృద్ధి బాలురపైననే యాధారపడి యున్నది. నేటిబాలురే రాబోవు పౌరులగుచున్నారు. కాన ప్రాథమిక పాఠశాలలలోనే సాంఘిక జీవనమునకు సంబంధించిన ఆరోగ్యనియమములు, శరీర నిర్మాణము, పరిపాలనా పద్ధతులు, ఎన్నికలు, పౌరజనులు, మొదలుగాగల ముఖ్యాంశములను బాలురు తెలిసికొని యుండుటవసరము. ప్రతివిద్యార్థికిని తాను వ్యవహరింపవలసిన విషయములకిది పునాది. విద్య దీనివలన బాలురు సత్ప్రవర్తనము కలవారగుటయేగాక బాధ్యతగల గ్రామస్థులై, వారివారి జీవనములను సక్రమముగ నడుపుకొని సుఖులగుదురను నాశయముతో నీసివిక్సు పాఠములు పాఠశాలలందు బోధింపబడుచున్నది.

## ప్రయోజనములు

1. సివిక్సుచదివినవాడు ఆదర్శప్రాయుడైన పౌరుడగును. స్వలాభమును లెక్కచేయక దేశక్షేమము నకై పాటుపడును. స్వతంత్రదీక్ష, స్వతంత్రబుద్ధి, కలిగియుండును. గంభీరోపన్యాసములకు తలయొగ్గక నిజస్థితియందే మక్కువను జూపును. చిత్రమైన కృత్రిమ గారడీలకు లొంగిపోడు. మోసమనుమాటనే వినడు. లోకవ్యవహారముల కొరకు రాజకీయ, సాంఘిక ఆర్థికశాస్త్రములను చదివి విమర్శించుకొనును.

2. సాంఘికశాస్త్రమునుగూడ అభ్యసించును గాన మునసబు, కరణము, రైతు, కుమ్మరి, పోలీసు, పోష్టు, మొదలగువారి విలువను తెలిసికొనును.

3. సాంఘిక పరిస్థితులనుబట్టి ప్రభుత్వ సమస్యలను తెలిసికొనుటకు వీలుకలుగును.

4 ఆరోగ్యముగా నుండుట, శుచి, శుభ్రము, మున్నగు శరీర శుభ్రతను కలుగజేయు మార్గములను గమనించును

5. బోధనామార్గము నిరుపమగు పరిశీలనా మార్గముగాన యుక్తాయుక్త వివేక మలవడును.

(6) పాఠశాల విడిచిన తరువాతకూడ దీని నభ్యసించినవాడు సత్ప్రవర్తనము కలిగియుండును దీని వలన నిష్కల్మష హృదయులగు దేశసేవాపరులే కల్మషులగు నిర్మాతలకంటె ముఖ్యులనునది వాని తలకెక్కును.

వేయేల - అడుగంటిపోయిన ఆచారములు, దగ్ధమైపోయిన దేశచరిత్ర, జీర్ణించిపోయిన పరిపాలనాదక్షత, పటాపంచలైన పరిశ్రమలు, దూరమైపోయిన దేహపటుత్వము, సమసిపోయిన ఔదార్యము, మాటుమణిగిపోయిన శౌర్యసాహసములు, బూడిదపాలైన భౌతికవిద్య అదః పాతాళమున కలిగిన యాధ్యాత్మికజ్ఞానము, మతుచెందిన మేధా

శకుల వీనిని వికాసింపఁజేసి పునరుద్ధరించి మన తొల్లిటి ప్రతిభను మరల నీభూస్థలిని నిల్పగల ప్రసాదించునది పాఠశాస్త్రమే!

## బోధన

సివిక్సు ఉపన్యాసములవలన, బోధనలవలన, చెప్పఁదగినది కాదు. అది ఆవేశపూరితమగు భావములను, ఉన్నతాదర్శములను కలది గావున పరిశీలనయే దాని నభ్యసింప చేయును. గాన సివిక్సుపాఠములు ప్రత్యక్షపరిశీలనా మార్గములందును, నాటకసంభాషణా పద్ధతులందును, నేర్పవలయును. బాలురను తీసికొనిపోయిచూపుట యుత్తమము. పోస్టాఫీసు, కలక్టరు కచ్చేరి, రైలు స్టేషను, గ్రామకచ్చేరి, మొదలగుస్థలములకు బాలురను తీసికొనిపోయి వారి వారి పనులను బాలురకు చెప్పవలెను. రోడ్లపై బండ్లుపోవుట, గురుతులు, మొదలగునవి ప్రత్యక్షపద్ధతిని నేర్పవలయును. వీలైనప్పుడు డిపార్టుమెంటుల గూర్చి నాటకము లాడించుచుండవలెను. హెల్తుడిపార్టుమెంటువారు ఆరోగ్యమును కాపాడుటకు చేయు ప్రయత్నములు పోష్టులో ఉత్తరము ప్రయాణముచేయుట, మొదలగునవి నాటకపద్ధతిని నేర్పవలయును. ఉపాధ్యాయులు సివిక్సుకథలను తయారుచేసి బాలురచే చదివించవలెను. ఇందువలన వాక్యరచనయందలి పద్ధతి జ్ఞాపకశక్తికూడ కలుగును. సివిక్సుబోధించు ఉపాధ్యాయుడు సత్ప్రవర్తనము కలవాడై ఆదర్శప్రాయుడై బాలురకు విద్య నేర్పవలయును.

---

# గుఱ్ఱంకథ

రచయిత : మేడూరి ఉమామహేశ్వరం, దొమ్మేరు.

చ. అతఁడొకకాపు దాను వ్యవహారమొకండొనరింపగోరి మంచి
చతురఁగమెక్కి యొక్కదెస శీఘ్రగతిన్ జనుచుండ దారిలో
నతఁడు కనుంగొనెన్ తనకు నడ్డముగా జనుదెంచు నక్కనొ
క్కతెఁ, గనినంత గోప మధికంబుగఁ దన్నలలింప చుండగన్.

ఆ. వె. పోవుచున్న కాపుఁ బోడగాంచి యా నక్క । యెటకుఁబోవుచుంటి విపుడ నాకుఁ
దెలుపుమన్నఁ గోపతీవ్రత మదినేచఁ । బదరి పొమ్మటంచు పలికె కాపు.

క. అనుచు నవారితకోపము । మనమున నేచంగఁ బలికె, మాయావియు నా
తని పలుకుల విని గ్రక్కున । జనె ప్రక్కకు దోషమానసము బాధింపన్.

మ. అకటా! యేకలుషంబు లేని నను మర్యాదేమియుం జూడకూ
రక నీవిట్టుల నిందఁజేసితివి సౌభ్రాతృత్వము న్మాని తా
వీక కార్యావసరంబున న్మది తలంప న్నాదుసాహాయ్య మిం
చుకయేని న్గొనకుండెదో? కొనెదో! నేనూతున్ భవద్గర్వమున్.

మ. అని గోమాయువు పల్క పాంథుఁడు మనోవ్యాపారవీలిన్ నిజా
శ్వనిరూఢుండయి మార్గముంబడి యథేచ్ఛన్ యాత్రసాగించి నం
జను నాతం డొకయూరుఁ జేరికొని విశ్రామార్థియై యొండుపా
రునిగేము న్గని యశ్వముం దిగి విలోలుండై కనెన్ గేస్తునిన్.

క. కనఁగొని యాగృహమేధికిఁ । తనకోరికఁ దెలుప నతఁడుదారుఁడవుటచే
ననువుగ నాతని కమ్మం । చును పల్కగ హర్షమానసుండయి యతఁడున్.

గీ. ఆగృహస్థుని పెరటియం దమరియున్న । పశుగణంబుల చెంత నశ్వంబుఁ గట్టి
లోని కరుదెంచి స్నానంబుఁ దా నొనర్చి। నాటి కే యట సుఖభోజనంబు గుడిచె.

ఆ. వె. స్వాంకతన మిగుల నడలియుండుటచేత । హాయిగుల్క నిదురఁ బోయినాఁడు
పెరటిలోన నీని తురఁగమున్న దటంచు। నెఱుఁగ డాగృహస్థుఁ డిసుఁడు వొడిచె.

క. ఆత జాయాసి కుమారుం - డాయెడ మేల్కాంచి పెరటి యాఁబోతులతో
మేయు హయంబును గని చని । నాయన చెంగటకు హర్షనాద మెలర్పన్.

ఉ. చూతము రండు మీ కధిక చోద్యము కల్గెడు సాహిణంబులో
రాతిరి పెద్దయెద్దు భళిరా తురఁగంబు నొకండు నీనె నం
చాతుర మొప్పఁ బల్కగ మహోద్భుతమానసుఁడై గృహస్థుఁడాఁ
బోఁతులసాలకుం జని ప్రమోద మెలర్పఁగ గాంచి గుఱ్ఱముం.

గీ. వినుఁడు పురజనులార యేమనుదు నాదు! వృషభమీ నెను గుఱ్ఱపుపిల్ల నొకతె
ననెడిపలుకులఁ బాంధుఁడు విని “మదీయ। గుఱ్ఱ మదిగాని మీయెద్దుకూనగాదు”

ఆ. వె. అనియతండు పలుక నదియెల్ల కాదంచు । విసిగినాఁ డాతని నగసరినాఁడు
అశ్వమునక పొమ్మటంచుఁ బల్కుచుకాఁపు। పలికినాఁ డపకృతుల్ సలిపినాఁడు.

క. చేయునదిలేక పాంథుం । డాయూరంగలుగు పెద్దలందరితోడన్
నాయశ్వము నీయన కా । జేయుచు నున్నాఁడు తెలియఁ జెప్పరె! యనినన్.

క. విని యాపెద్దలు వారి నీ । దని తెల్పెడివార లెవ్వరైనను గలరా?
యని యడుగఁగ పాంథుఁడు తన। మనమున యోచింప నక్కమాట స్ఫురించెన్.

గీ. వేరుగతిలేక యాబాటసారి సరిగ । నక్కదిక్కున కరిగి విన్నపముతోడ
తనకుఁ గలిగినచిక్కు నంతయును దెలుప । సరిగ దెప్పుచు వానితో నరిగెనక్క.

ఉ. “హా” యని యాపురంబుజని యంబుధితీరమునందు నిల్చి గో
నూ యువు గోలుగోలుమని మాటికిమాటికి, నేడ్చుచుండ నే
వూ? యని రోదనంబుఁ బలుమారు వినంబడఁ జేరి కాఁపు “యే
మీ యిటులేడ్చుచుంటి” వన నిట్టులఁ బల్కె వడంకు గొంతుతోన్.

గీ. ప్రళయకాలాన వెలువడుపగిదిఁ జెలఁగి । పెరుగుచున్నది మంట సాగరమునుండి
కాంచరే యంచు పల్క నాగ్రామవాసు । లందఱుంగూడ విస్మయమందిరపుడు.

గీ. నీరు మండుట సహజమా? నీకు వెఱ్ఱి । పుట్టెనద? యంచు పౌరులుమూగి నుడువ
యెద్దు గుఱ్ఱంబునీను టదెట్టులుండె? సాగరంబున మంటలసరణిఁ గాదె?

ఆ. వె. అనుచు నక్కపల్క నద్దానియుక్తికి । మెచ్చినారు గుఱ్ఱమిచ్చినారు
ఆగృహస్థు చెప్పునది యెల్లతప్పంచు । పలికినా రెంతయో కులికినారు.

గీ. హాయముఁగొని యేగి కాపుగమ్యతలమునకు। “గొప్పవారము మేము; తక్కువకులాన
జనన మొందిరి మీర” ని యనఁగరాదు । సృష్టిఁ బ్రతిజీవి సమము విస్పష్టముగను.

# బిడ్డల యొక్క తూనికలు

శేషమల సూర్యనారాయణశాస్త్రి

| వయస్సు | యెత్తు | బరువు | రిమార్కు |
|---|---|---|---|
| జననమప్పుడు | 19½ అం. | 7½ lb పౌ. | 5 వ ఏట 50 పౌనులు |
| 1 వ నెల | 20½ అం. | 8½ ,, | పదవఏట 68 పౌనులు |
| 2 నెలలు | 21 ,, | 10½ ,, | పండ్రెండవ యేట 79 |
| 3 నెలలు | 22 ,, | 12 ,, | పౌనులుపండ్రెండు సం |
| 4 ,, | 23 ,, | 13 ,, | వత్సరముల వరకు |
| 5 ,, | 23½ ,, | 14½ ,, | బాలురుబాలికలకన్న |
| 6 ,, | 24 ,, | 15 ,, | బరువుగా యుందురు. |
| 7 ,, | 24½ ,, | 16 ,, | తరువాత బాలికలు |
| 8 ,, | 25 ,, | 18 ,, | బాలురకన్న బరువు |
| 9 ,, | 25½ ,, | 19 ,, | అగుదురు. |
| 10 ,, | 26 ,, | 19½ ,, | |
| 11 ,, | 26½ ,, | 20 ,, | |
| 12 ,, | 27 ,, | 21 ,, | |

---



---

# ఆహ్వానము

కృష్ణాజిల్లా నాన్ మినర్ ఎయిడెడ్ ఎలిమెంటరీపాఠశాలల టీచరు మేనేజర్ల సంఘము స్థాపించుటకు ది 4—7—43 తేది ఆదివారం ఉదయం 9 గంటల లగాయత్తు బందరు బృందావన టాకీస్ హాలులో మహాజనసభ జరుగును మ. రా. రా. శ్రీ చావలి సూర్యప్రకాశరావుపంతులు బి. యే. యల్ టి. రిటైర్డు జిల్లా విద్యాశాఖాధికారిగారు అగ్రాసనాధిపతిగా యుండుటకును, శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారు సభను ప్రారంభించుటకును, దయతో నంగీకరించిరి. కాన ఎల్లరు తప్పక విచ్చేయ ప్రార్థన.

ఆహ్వానసంఘము,
1—6—1943.

వై. వి. నరశింహాచార్యులు,
ఐ. యల్. నారాయణ,
బందరు తాలూకా టీచరు మేనేజర్ల సంఘ అధ్యక్షుడు, కార్యదర్శి,
దెందులూరి లక్ష్మీనారాయణ,
కె వి. సుబ్బారావు,
రాష్ట్ర సంఘ సభ్యులు.

N. B. ఆహ్వాన సంఘమువారిచే భోజనవసతి ఉచితముగా ఏర్పాటు చేయబడినది.

---

## గుంటూరు తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచర్సు యూనియన్
## (గుంటూరు) రిజిష్టర్డు 1941

తే 25—4—43 దీన గుంటూరు మునిసిపల్ సెంట్రల్ స్కూలు భవనమునందు సాయంత్రము 4 గంటలకు శ్రీయుత యొరిచర్ల ఏసయ్యగారి అధ్యక్షతను గుంటూరు తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచర్సు యూనియన్ మహాజనసభాసమావేశము జరిగెను.

ఈ దిగువ నుదహరించిన తీర్మానములు ఏకగ్రీవముగా తీర్మానింపబడెను.

I. యూనియన్ నిబంధనల సవరణలు.

సవరింపబడిన యూనియన్ నిబంధనల ప్రకారము ఈదిగువ నుదహరించినవారు కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా నెన్నుకొనబడిరి.

1. శ్రీ యొరిచర్ల ఏసయ్యగారు, హెడ్ మాష్టరు యు. యల్. సి. యమ్. స్కూల్ పాతగుంటూరు. ప్రెసిడెంటు.
2. శ్రీ వి. హెచ్. నాగభూషణంగారు అసిస్టెంటు పి. వి. హెచ్. స్కూలు లాలాపేట, గుంటూరు. వైస్ ప్రెసిడెంటు.
3. శ్రీ కామరాజు వెంకట్రామయ్యగారు హెడ్ మాష్టరు భారత విద్యాలయము బ్రాడీపేట గుంటూరు. సెక్రటరీ.
4. శ్రీ అక్కిరాజు మృత్యుంజయశర్మగారు అసిస్టెంటు హెచ్. యు. స్కూలు ఆనందతీర్థ అగ్రహారం గుంటూరు. అసిస్టెంటు సెక్రటరీ.

5. శ్రీ యం. భోగప్పగారు టీచరు మేనేజరు ఆది ఆంధ్ర స్కూల్ యానాదికాలని గుంటూరు. కోశాధిపతి.

దూరస్థ గ్రామ ప్రాంతముల కార్యనిర్వహణములకు గాను ఆయా సెంటర్లనుండి యెన్నుకొనబడిన సాయీ సంఘ సభ్యులు ద్వారా యెన్నికలు జరిపి జాయింటు సెక్రటరీని యేర్పాటుచేయవలెనని ఎగ్జిక్యూటివ్ కమిటీవారిని. కోరుచు తీర్మానించడమైనది.

1. శ్రీ భట్టిప్రోలు రామకోటేశ్వరరావుగారు హెడ్ మాష్టరు శ్రీ సీతారామ విద్యాలయము, అగ్రహారం గుంటూరు. ఎగ్జిక్యూటివ్ మెంబరు.
2. శ్రీ పుల్లగంటి సత్యనారాయణగారు అసిస్టెంటు శ్రీ పాండురంగ విద్యాలయం బ్రాడీపేట గుంటూరు. డిటో.
3. శ్రీ పుల్లకంటి వెంకటసుబ్బారావుగారు అసిస్టెంటు పి. వి. హెచ్. యి. స్కూల్ లాలాపేట గుంటూరు. డిటో

Note:— పాలకవర్గమువారు ఆరుగురును ఎగ్జిక్యూటివ్ మెంబర్లు ముగ్గురును కలసి కార్యనిర్వాహకవర్గము.

2. ఏయిడెడ్ బాలికా పాఠశాలనుండియు, మహమ్మదీయబాలికాపాఠశాలనుండియు, సాయీసంఘ సభ్యత్వమునకు ప్రతినిధి నెన్నుకొనవలసినదని తే8.12.40 న యూనియన్ మహాజన సభయందు తీర్మానించబడిన తీర్మాన ప్రకారము కార్యనిర్వాహక వర్గమువారు యెన్నికలు జరిపించి సభ్యులను యేర్పరుచుటకు యూనియన్ మహాసభవారు కార్యనిర్వాహక వర్గమువారికి అధికారము యివ్వడమైనదని తీర్మానించడమైనది.

3. యుద్ధజ్వాలలు ప్రపంచమందంటను వ్యాపించి తీవ్రముగానున్నను బ్రిటీషువారు తమ అసమాన సామర్థ్యశక్తులచే వానినన్నిటి నెదుర్కొని శత్రువిజృంభణ నణగద్రొక్కుచున్నందుకు ప్రభుత్వము వారిని శ్లాఘించుచు యూనియన్ మహాజనసభవారు బ్రిటీషువారికి, మిత్రమండలివారికి, సర్వదా విజయము కాంక్షించుచు తీర్మానించడమయినది.

4. నెలకు టీచరు 1 కి రు 2 చొ॥ ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలో ఉపాధ్యాయులకు కఱవు భత్యము శాంక్షన్ చేసినందుకు ప్రభుత్వమువారిని కొనియాడుచు సదరు రు 2 ల యలవెన్సు చాల స్వల్పమనిన్నీ జి, ఓ. నెంబరు 159 — 28-8-42 ఆనుసరించియు, తరువాత జి. ఓల ననుసరించియు, ప్రభుత్వము తదితర శాఖోద్యోగస్థులకు యిచ్చిన రేటు రు 6-8-0 చొ॥ న ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలోపాధ్యాయులకుగూడ కఱవుభత్యము ప్రసాదించగలందులకు యీయూనియన్ మహాజనసభవారు ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

5. మేనేజర్లు తమబడులలోని యుపాధ్యాయులకు పూర్తిగ్రాంటులను యిచ్చుటకున్నూ ప్రభుత్వము మేనేజర్లకు బడియిండ్లకు అద్దెలు, ఇతరకంటిన్‌జన్సీలు వగైరాఖర్చులు ప్రసాదించుటకున్నూ, యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

6. ప్రతిస్కూలునకు అధమము ఏస్సెండుగ్రాంటునకు తక్కువగాకుండ ప్రసాదించుటకు ప్రభుత్వము వారిని యూనియన్ మహాసభవారు కోరుచున్నారు.

7. ప్రతి తాలూకాలోని ఎడ్వైజరి కమిటీలలో మిషను మేనేజర్లకువలె టీచర్ల మేనేజర్లకుగాని, టీచర్లకుగాని, రెండుస్థానములలో నేర్పాటు చేయగలందులకుగాను ప్రభుత్వమువారిని యూనియన్ మహాసభవారు ప్రార్థించుచున్నారు.

8. ప్రస్తుత జీవితావసరములకు కావలసినధరలు దినదినము విపరీతముగా పెరుగుచున్నందున ఎలిమెంటరీస్కూళ్ళ ఉపాధ్యాయులకు శ్రీయుత జాన్‌సార్జెంటు కమిటీవారి సూచనలననుసరించి నిర్ణయించబడిన టైము స్కేళ్ళను రు 35-1-50 (4 ఏండ్ల కొకమారు) వారిసూచనలను బలపరచుచు సత్వరము అమలు పరుప ప్రభుత్వమువారిని కోరుచు యీ సభవారు తీర్మానించడమైనది.

9 ప్రాథమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు కూడ జి. ఓ నంబరు 5093-7-12-1933 ప్రకారము డ్యూటీయెలవెన్సుల నేర్పాటుచేయుటకు సర్కారువారిని కోరుచూ యీసభవారు తీర్మానించడమైనది.

10. ప్రాథమిక పాఠశాలలకు సంబంధించిన సమస్త జి. ఓలు, ప్రొసీడింగ్సు వగైరాలు కాపీలు జిల్లాలోని సమస్త సెంటరు టీచర్సు అసోసియేషన్సుకు పంపగలందులకు శ్రీయుత జిల్లా విద్యాశాఖాధికారిగారిని వేడుటకు తీర్మానించడమైనది.

కె. వెంకట్రామయ్య, సెక్రటరీ.

---

# సరిపల్లి

## సంరక్షక కార్యనిర్వాహక సభాసమావేశము

ది 15-5-43 తేదిన శ్రీ P V. కృష్ణారావు B. A గారి అధ్యక్షతను పై సభవారు సమావేశమై ప్రార్థన జరిగిన తరువాత మీటింగు చర్యను చూచిన అనంతరము ఈ క్రింది విషయముల నేకగ్రీవముగ తీర్మానించిరి.

పరమపవిత్రమైన ఉపాధ్యాయులవృత్తిపై అధికారమును చలాయించుటలో అనేకమంది అధికారులుండియు వారికి కరవులో ఎట్టి ధనసహాయము లేక నిరాధారులై యుండినందుకు విచారమును వెలిబుచ్చుచూ ఉపాధ్యాయుని మనశ్శాంతియే ప్రపంచసౌభాగ్యము గాన వారికి బాకీలతో సహా యింక్రిమెంట్లు లేక కరవు భత్యములు లేక యుద్ధఎలవెన్సులు, అను వాటివలన వారికి ధనసహాయము చేయవలసినదిగా ఉభయాధికారులను కోరుటకున్నూ, ఉపాధ్యాయులు అధికారరహితులు, పూర్ణకాలపు సేవకులు అగుట వారికి కావలసిన ఆహారపదార్థములు సక్రమముగా దొరుకునట్లేర్పాట్లు జరిగింపించవలసినదని కోరుటకున్నూ, పాలకులు పాలితుల కష్టసుఖముల గుర్తించుట వారి పాలకధర్మమనియు కాలమాన కనుకూలముగా బడిగంటలు మార్పు చేయించవలసినదనియు, గల తీర్మానములు తీర్మానించబడెను.

ఆచార్య—సింహా.
సెక్రటరీ.

---

కొత్తలూరు,
5—5—1943.

అయ్యా !

మా గ్రామ శ్రీకృష్ణవిద్యాలయము సాలుసరి పరీక్షనిమిత్తము వినుకొండ రేంజి స్కూల్సు సీనియరు డిప్యూటి ఇన్‌స్పెక్టరు వారగు శ్రీయుత బీరక చంచయ్యపంతులుగారు బి. ఎ. బి. ఇడి. విజయముచేసిరి. పాఠశాల పరీక్షానంతరము సాయంత్రము 7 గంటలకు శ్రీ రామాలయమువద్ద యుద్ధ ప్రచారము నిమిత్తము గొప్ప సభను జరిపిరి. 200 మంది పైగా పౌరులు హాజరైరి. ప్రారంభమున పాఠశాల బాలురచే దైవప్రార్థన గావింపబడి "సందేహమేలరా యన్న" యను కీర్తనపాడి ప్రేక్షకుల నానందపరచిరి. పిదప యీ పాఠశాలప్రధానోపాధ్యాయుడు అన్నాప్రగడ వెంకటసుబ్బారావు మరికొన్ని యుద్ధప్రచారకీర్తనలనుపాడి బ్రిటిషువారికి విజయము తప్పదనియు ప్రభుత్వమువారికి సైనిక ధన సహాయముల చేయవలెననియు చెప్పిరి. శ్రీయుత చంచయ్యపంతులుగారు నేటి యుద్ధపరిస్థితుల గురించి మిత్రమండలికే మాత్రము సందేహములేక జయము చేకూరగలదని ఉదాహరణల మూలమున విశదపరచుచు అతి గంభీరోపన్యాసమును ఒక గంటసేపు చెప్పిరి. వారి మృదుమధురోక్తుల విని ఆనందించుచు పౌరులు నిశ్శబ్దముగ నుండిరి. హెడ్మాష్టరుగారు యిట్టి అమోఘ ఉపన్యాసమొసంగినందులకు సభతరపున కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించెను. మిత్రమండలి విజయమునకు భగవంతుని ప్రార్థించుటతో సభముగించబడెను.

సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితో సహా)  Reg. No. M. 3766

సంపుటము 32  సంచిక 4

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

**జూలై 1943**

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు.

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# వి ష య సూ చి క